## అథ అష్టమో%ధ్యాయః

## యుగ సంఖ్యా వర్ణనము

ఋషయ ఊచుః |

కేన మానేన కాలే %స్మిన్నాయుస్సంఖ్యా ప్రకల్ప్యతే | సంఖ్యారూపస్య కాలస్య కః పునః పరమో% వధిః || 1

ఋషులు ఇట్లు పలికిరి -

ఈ కాలమునందు ఏ మానముచే ఆయర్దాయము పరిగణించబడుచున్నది? సంఖ్యారూపములో నుండే ఈ కాలమానములో చరమసంఖ్య ఏది?(1)

వాయురువాచ |

ఆయుషో%త్ర నిమేషాఖ్యమాద్యమానం ప్రచక్షతే | సంఖ్యారూపస్య కాలస్య శాంత్యతీతకలావధిః || 2

అక్షిపక్ష్మపరిక్షేపో నిమేషః పరికల్పితః | తాదృశానాం నిమేషాణాం కాష్ఠా దశ చ పంచ చ || 3

కాష్ఠాస్త్రింశత్కలా నామ కలాస్త్రింశన్ముహూర్తకః | ముహూర్తానామపి త్రింశదహోరాత్రం ప్రచక్షతే || 4

త్రింశత్సంఖ్యైరహో రాత్రై ర్మాసః పక్షద్వయాత్మకః || 5

జ్ఞేయం పిత్ర్యమహోరాత్రం మాసః కృష్ణసితాత్మకః || 6

మాసైసై#ఃరయనం షడ్భిర్వర్షం ద్వే చాయనే మతమ్ | లౌకికేనైవ మానేన అబ్దో యో మానుషస్స్మృతః || 7

ఏతద్దివ్యమహోరాత్రమితి శాస్త్రస్య నిశ్చయః | దక్షిణం చాయనే రాత్రిస్తథోదగయనం దినమ్ || 8

మాసస్త్రింశదహోరాత్రైర్దివ్యో మానుషవత్స్మృతః | సంవత్సరోఽపి దేవానాం మాసైర్ద్వాదశభిస్తథా || 9

త్రీణి వర్షశతాన్యేవ షష్టివర్షయుతాన్యపి | దివ్యస్సంవత్సరో జ్ఞేయో మానుషేణ ప్రకీర్తితః || 10

దివ్యేనైవ ప్రమాణ   న యుగసంఖ్యా ప్రవర్తతే | చత్వారి భారతే వర్షే యుగాని కవయో విదుః || 11

వాయువు ఇట్లు పలికెను -

ఆయుర్దాయములోని మొట్టమొదటి మానమునకు నిమేషము అని పేరు. సంఖ్యారూపమగు కాలమునకు శాంత్యతీతము అనే కాలాంశము అంతిమమానమని చెప్పెదరు(2).కనురెప్పపాటు కాలమునకు నిమేషము అని పేరు. పదిహేను నిమేషములు ఒక కాష్ఠ యగును (3). ముప్పది కాష్ఠలు ఒక కళ యగును. ముప్పది కళలు ఒక ముహూర్తము అగును. ముప్పది ముహూర్తములు ఒక రోజు (రాత్రి మరియు పగలు) అగును (4). ముప్పది రోజులు ఒక నెల. ఒక నెలలో రెండు పక్షములు గలవు (5). కృష్ణపక్షము మరియు శుక్లపక్షము కలిసి ఒక నెల అగును. అట్టి నెల పితృదేవతలకు ఒక రోజు అగును (6). ఆరు మాసములు ఒక అయనము. రెండు అయనములు ఒక సంవత్సరము. ఈ లోకములో మనుష్యమానముచే ఏ కాలము సంవత్సరమో, అదే కాలము దేవతలకు ఒక రోజు అని, అనగా ఉత్తరాయణము పగలు మరియు దక్షిణాయనము రాత్రి అని శాస్త్రము యొక్క నిశ్చయము (7,8). మనుష్యమానములో వలెనే, ముప్పది దివ్యదినములు ఒక దివ్యమాసము అగును. అదే విధముగా, పన్నెండుదివ్యమాసములు దేవతలకు ఒక సంవత్సరమగును (9). మనుష్యమానముచే మూడు వందల అరవై సంవత్సరముల కాలము దేవతలకు ఒక సంవత్సరమగును (10). యుగముల సంఖ్య దివ్యమానముచే మాత్రమే లెక్కించబడుచున్నది. భారతదేశములో నాలుగు యుగములు ఉండునని పండితులు చెప్పుచున్నారు (11).

పూర్వం కృతయుగం నామ తతస్త్రేతా విధీయతే | ద్వాపరం చ కలిశ్చైవ యుగాన్యేతాని కృత్స్నశః || 12

చత్వారి తు సహస్రాణి వర్షాణాం తత్కృతం యుగమ్ | తస్య తావచ్ఛతీ సంధ్యా సంధ్యాంశశ్చ తథావిధః || 13

ఇతరేషు ససంధ్యేషు ససంధ్యాంశేషు చ త్రిషు | ఏకాపాయేన వర్తంతే సహస్రాణి శతాని చ || 14

ఏతద్ద్వాదశసాహస్రం సాధికం చ చతుర్యుగమ్ | చతుర్యుగసహస్రం యత్స కల్ప ఇతి కథ్యతే || 15

చతుర్యుగైకసప్తత్యా మనోరంతరముచ్యతే | కల్పే చతుర్దశైకస్మిన్మనూనాం పరివృత్తయః || 16

ఏతేన క్రమయోగేన కల్పమన్వంతరాణి చ | సప్రజాని వ్యతీతాని శతశో % థ సహస్రశః || 17

అజ్ఞేయత్వాచ్చ సర్వేషామసంఖ్యేయతయా పునః | శక్యో నైవానుపూర్వ్యాద్వై తేషాం వక్తుం సువిస్తరః || 18

కల్పో నామ దివా ప్రోక్తో బ్రహ్మణో% వ్యక్తజన్మనః | కల్పానాం వై సహస్రం చ బ్రాహ్మం వర్షమిహోచ్యతే || 19

వర్షాణామష్టసాహస్రం యచ్చ తద్బ్రహ్మణో యుగమ్ | సవనం యుగసాహస్రం బ్రహ్మణః పద్మజన్మనః || 20

సవనానాం సహస్రం చ త్రిగుణం త్రివృతం తథా | కల్ప్యతే సకలః కాలో బ్రహ్మణః పరమేష్ఠినః || 21

కృత, త్రేతా, ద్వాపర, కలియుగములు అనునవి మొత్తము నాలుగు యుగములు (12). నాలుగు వేల సంవత్సరములు కృతయుగము. నాలుగు వందల సంవత్సరములు రెండు యుగముల మధ్య సంధి. వంద సంవత్సరములు సంధ్యాంశము (సంధిలోని భాగము) (13).

వీటిలో క్రమముగా ఒకటి ఒకటి చొప్పున వేలలో తగ్గించినచో యుగములు, వందలలో తగ్గించినచో యుగసంధులు మరియు సంధ్యాంశములు అగును (14). ఈ విధముగా అధికాంశములతో కలిపి పన్నెండు వేల సంవత్సరముల కాలము ఒక కల్పము అని పేరు. (15). డెబ్బది ఒక్క చతుర్యుగములు ఒక మన్వంతరమగును. ఒక కల్పములో పదు నాలుగు మన్వంతరములు ఉండును (16). ఈ విధముగా ప్రజలతో కూడియున్న కల్పములు మరియు మన్వంతరములు వందల మరియు వేల సంఖ్యలో ఒక క్రమములో గడచి పోయినవి (17). వాటి సంఖ్య అపరిమితము. వాటిని సంపూర్ణముగా తెలియుట సాధ్యము కాదు. కావున వాటిని ఖచ్చితమగు క్రమములో విస్తారముగా వర్ణించుట శక్యము కానే కాదు (18). అవ్యక్తము (మాయాశక్తి) నుండి జన్మించిన బ్రహ్మకు కల్పము ఒక పగలు అగును. ఈ బ్రహ్మాండములో వేయి కల్పములు బ్రహ్మకు ఒక సంవత్సరమగును (19). ఇట్టి వేయి సంవత్సరములు బ్రహ్మకు ఒక యుగము అగును. ఇట్టి వేయి యుగములు పద్మమునుండి జన్మించిన బ్రహ్మకు ఒక సవనమగును (20). సర్వజగత్కారణమగు బ్రహ్మకు మూడువేల మూడు సవనములు పూర్ణమగు ఆయుర్దాయము అగును (21).

తస్య వై దివసే యాంతి చతుర్దశ పురందరాః | శతాని మాసే చత్వారి వింశత్యా సహితాని చ || 22

అబ్దే పంచ సహస్రాణి చత్వరింశద్యుతాని చ | చత్వారింశత్సహస్రాణి పంచ లక్షాణి చాయుషి || 23

బ్రహ్మ విష్ణోర్దినే చైకే విష్ణూ రుద్రదినే తథా | ఈశ్వరస్య దినే రుద్రస్సదాఖ్యస్య తథేశ్వరః || 24

సాక్షాచ్ఛివస్య తత్సంఖ్యస్తథా సో%పి సదాశివః | చత్వారింశత్సహస్రాణి పంచలక్షాణి చాయుషి || 25

తస్మిన్ సాక్షాచ్ఛివేనైష కాలాత్మా సంప్రవర్తతే |
యత్తత్సృష్టేస్సమాఖ్యాతం కాలాంతరమిహ ద్విజాః || 26

ఏతత్కాలాంతరం జ్ఞేయమహర్వై పరమేశ్వరమ్ | రాత్రిశ్చ తావతీ జ్ఞేయా పారమేశస్య కృత్స్నశః || 27

అహస్తస్య తు యా సృష్టి రాత్రిశ్చ ప్రలయస్స్మృతః | అహర్న విద్యతే తస్య న రాత్రిరితి ధారయేత్ || 28

ఏషో % పచారః క్రియతే లోకానాం హితకామ్యయా | ప్రజాః ప్రజానాం పతయో మూర్తయశ్చ సురాసురాః || 29

ఇంద్రియాణీంద్రియార్థాశ్చ మహాభూతాని పంచ చ | తన్మాత్రాణ్యథ భూతాదిర్బుద్ధిస్చ సహ దైవతైః || 30

అహస్తిష్ఠంతి సర్వాణి పరమేశస్య ధీమతః | అహరంతే ప్రలీయంతే రాత్ర్యంతే విశ్వసంభవః || 31

యో విశ్వాత్మా కర్మకాలస్వభావాద్యర్థే శక్తిర్యస్య నోల్లంఘనీయా|

యస్మై#్యవాజ్ఞాధీనమేతత్సమస్తం నమస్తస్మై#్మ మహతే శంకరాయ || 32

ఇతిశ్రీశివమహాపురాణ వాయవీయసంహితాయాం పూర్వభాగే చతుర్యుగసంఖ్యా నిరూపణం నామ అష్టమో%ధ్యాయః (8).

బ్రహ్మగారి ఒక రోజులో పదు నాలుగు, నెలలో నాలుగు వందల ఇరవై, సంవత్సరములో అయిదు వేల నలభై, మరియు పూర్ణాయుర్దాయములో అయిదు లక్షల నలభై వేల ఇంద్రుల ఆయుర్దాయము పూర్తి యగును (22, 23). బ్రహ్మయొక్క ఆయుర్దాయము విష్ణువునకు ఒక రోజు, విష్ణువుయొక్క ఆయుర్దాయము రుద్రునకు ఒక రోజు. అదే విధముగా, రుద్రుని ఆయుర్దాయము సదాశివునకు ఒకరోజు, సదాశివుని ఆయుర్దాయము సాక్షాత్తుగా ఈశ్వరునకు ఒక రోజు.సదాశివుని ఆయుర్దాయములో అయిదు లక్షల

నలభై వేల మంది రుద్రులు ఉందురు (24, 25). ఈ కాలపురుషుడు సాక్షాత్తుగా శివునిచే ప్రేరితుడై జగత్తులో ప్రవర్తిల్లుచున్నాడు. ఓ బ్రాహ్మణులారా! ఈ లోకములో సృష్టికి సంబంధించి వర్ణించబడిన సర్వము కాలములో అంతర్భాగమగును (26). ఈ సృష్టి అనే కాలఖండము పరమేశ్వరునకు పగలు. పరమేశ్వరుని రాత్రి కూడ ఇదే కాలపరిమాణములో నుండునని తెలియుడు (27). పరమేశ్వరుని పగలు సృష్టి. ఆయన రాత్రియే ప్రళయమని మహర్షులు చెప్పుచున్నారు. కాని, పరమేశ్వరునకు యథార్థముగా పగలు, రాత్రి ఉండవని తెలియవలెను (28). ప్రాణుల హితమును గోరి పరమేశ్వరుడు ఈ ప్రళయమును చేయును. ప్రజలు, ప్రజాపతులు, త్రిమూర్తులు, దేవతలు, రాక్షసులు (29), ఇంద్రియములు, ఇంద్రియములకు గోచరమగు విషయములు, పంచ మహాభూతములు, వాటి సూక్ష్మకారణములగు పంచ తన్మాత్రలు, మహత్తత్త్వము (పంచభూతములకు కారణము), దేవతలు (30) అను ఈ సర్వము చైతన్యస్వరూపుడగు పరమేశ్వరుని పగటి సమయములో ఉనికిని కలిగియున్నవి. పగలు పూర్తి కాగానే ఇవి అన్నీ ఆయనలో విలీనమగును. రాత్రి పూర్తి కాగానే మరల జగత్తు పుట్టును (31). ఆ ఈశ్వరుడు జగత్తుయొక్క రూపములో ప్రకటమై యున్నాడు. కర్మ, కాలము, అవిద్య మొదలగు రూపములలో ప్రకటమయ్యే ఆ పరమేశ్వరుని శక్తిని ఎవ్వరైననూ ఉల్లంఘించలేరు. ఈ సకలజగత్తు ఆయన ఆజ్ఞకు వశవర్తియై యున్నది. అట్టి పరబ్రహ్మస్వరూపుడగు శంకరునకు నమస్కారము (32).

శ్రీ శివమహాపురాణములోని వాయవీయసంహితయందు పూర్వభాగములో యుగసంఖ్యావర్ణనము అనే ఎనిమిదవ అధ్యాయము ముగిసినది (8).